Regd No. N. 45 / M. 3813

వెల ఒక అణా



# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక



సంపుటము ౧౬ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౩ వృషసం॥ర ఆషాఢ బ॥ ౨ (౪-౧౦-౧౩౫౦ ఫ.) గురువారము సంచిక ౨౦

# యూరోపు మహాయుద్ధము

## రష్యా జర్మనీ రంగము

లక్షల రష్యను సైన్యమును జర్మనీవారు పట్టుకొనుట

౬ లక్షల జర్మను సైనికులు హతులగుట

రష్యావారి తీవ్రప్రతిఘటన

## సిరియాపర్వము ముగియనుండుట

### రష్యా జర్మనీయుద్ధము

౫ జూలయినాడు రష్యావారీవిధముగా ప్రకటించినారు. "మిన్‌స్కు నగరానికి తూర్పున బెరిసినాయను నదియున్నది. దానిని దాటివచ్చుటకు జర్మనులు చాలాతీవ్రమయిన ప్రయత్నము చేసిరి. కాని విజయముపొందజాలక పోయిరి. మిన్‌స్కు నగరానికి ఉత్తరమున ౧౦౦ మైళ్ళ దూరములో పోలోట్సక అను పట్టణమున్నది. అచ్చట బెరెసీనా ద్వీనానదితో సంగమమగుచున్నది, ఆసంగము స్థలమును ముందుకువచ్చుటకు ప్రయత్నించు . . ., దినమంతయు పోరాడిన తర్వాత . . .రము నాడు చాలా మైళ్ళ వెనుకకు మరలి పోవలసివచ్చెను. పోలెట్‌క ఉత్తరములో ౧౦౦ మైళ్ళ దూరములో ఉన్న ద్వీన్‌స్కు పట్టణమువద్ద భయంకరయుద్ధము జరిగినతరువాత రష్యను సైన్యము వెనుకకు మరలివచ్చెను.

### లక్షల జర్మనులహతము

ఇంతవరకు ఈరష్యా జర్మనీయుద్ధములో ౩ ల॥ జర్మను సైనికులు హతులు కావింపబడిరి రియు గాయములనుపొందిరి, అని రష్యావారు వ్రాయుచున్నారు- జర్మనీవారికి విమానాలు ఎక్కువ నష్టమయినందున ఫ్రాన్సులో ఉంచియుండిన డిస్ట్రాయరు విమానాలను తెప్పించుకొన్నట్లుగా రష్యావారు ప్రకటించినారు

### రష్యా భూగోళము

రష్యాలో జరుగుయుద్ధమును అర్థము చేసుకొనుటకు పూర్వసంచికలో దానియొక్క కొన్ని భౌగోళిక సీమలు తెల్పబడియుండెను- ఇప్పుడు మరికొన్ని తెలుపబడుచున్నవి.

పోలెండుకు తూర్పున రష్యాయున్నది- పోలెండు సరిహద్దువద్ద రష్యాదేశములోని కొన్ని ముఖ్యపట్టణాలున్నవి- లిథుయేనియాకు తూర్పున రష్యా సరిహద్దులో ద్వీన్‌స్కు పట్టణమున్నది- దానికి ౧౦౦ మైళ దక్షిణములోను పోలెండు సరిహద్దుకు ౩౦ మైళ్ళ దూరములోను రష్యావారి లెపల్ అనుపట్టణమున్నది- దానికి . . . మైళ్ళదక్షిణములో పోలెండు సరిహద్దుకు ౧౬ మైళ్ళదూరములో మిన్‌స్కు అనుపట్టణము. . . మిన్‌స్కు పట్టణానికి ౭౦ మైళ్ళదక్షిణమున . . .స్కు అనుపట్టణమున్నది- దాని . . . ౨౫౦ మైళ్ళదక్షిణములో "జిటోమిర్" . . . మున్నది- దానికితూర్పున సుమా[ర]ు . . . దూరములో యుక్రేనుముండలానికి ముఖ్యనగరమయిన కీవుపట్టణమున్నది- కొనింగుబర్గునకు తూర్పున ౧౫౦ మైళ్ళదూరములో స్మోలెన్‌స్కు పట్టణమున్నది- దీనికి ఈశాన్యదిక్కున ౨౫౦ మైళ్ళదూరములో మాస్కో నగరమున్నది- రష్యా కుదక్షిణములో నల్లసముద్రమున్నది- అచ్చట రష్యావారి కొన్ని ఓడరేవుపట్టణాలున్నవి- అందు ముఖ్యమయినవి ఒడెస్సా, సెబాస్టపోలు, బాటూమ్ అనునవి- ఇదేనల్లసముద్రము . . . రొమేనియా వారికిసంబంధించిన కాన్‌స్టాన్‌జా అను ఓడరేవుకలదు-ఇకరష్యాలోనదుల చర్చ యీయుద్ధములో వచ్చుచున్నందున వాటినిగూడ గమనించవలసియుండును. రష్యాలో ౫ పెద్దనదులున్నవి, ఉత్తరములో పెచ్లోఅనునది ఆర్కిటిక మహాసముద్రములోనికి పారుచున్న . . . ఇంకొకటి ద్వీనా రష్యాసరిహద్దునుండి లాట్వియాలో పారుచు బాల్టికుసముద్రములోపడుచున్నది- దక్షిణపు దిక్కుగా కొన్ని నదులు ప్రవహించి నల్లసముద్రములోపడుచున్నవి- అందుముఖ్యమైనవి రుమేనియాసరిహద్దు పొడవునపారుచున్నట్టి "ప్రథ్" అనునది. దానికితూర్పున "నీస్టర్" అనునది పారుచున్నది, నీస్టరుకుతూర్పున నీపరుఅనునదిపారుచున్నది. ఇదిచాలగొప్పనది- ఉత్తరములో స్మోలెన్‌స్కు పట్టణానికి ౧౦౦ మైళ్ళఉత్తరమున పుట్టి దక్షిణముగపారుచున్నది- పోలెండుసరిహద్దుపొడవునను రష్యావారు తమ సరిహద్దు పొడవున ౧౦ మైళ్ళ వెడల్పున అంతటను మిలిటరీ సంరక్షణ యేర్పాటులను చేసియున్నారు. స్టాలిన్ లైన్ (లేకదీనిని స్టాలిన్ పంక్తి) అనియందురు.

### జర్మనుపక్షపు వార్తలు

జర్మనులు రష్యా సరిహద్దునుండి యంతటను రష్యాసైన్యాలను వెనుకకు మరలగొట్టుచున్నామనియు ఇప్పుడు స్టాలిన్ లైన్ అంతటను ఉభయవర్గాలకు ఘోరయుద్ధము జరుగుచున్నదనియు చెప్పుచున్నారు. ౫ జూలయివరకు జర్మనులుఉత్తరమున నీపరునదిని సమీపించినామని చెప్పుచున్నారు - హంగరీవారు రష్యావారి రెండుపట్టణాలను పట్టుకొన్నా మనుచున్నారు. దక్షిణములో బుకవీనాలోని "కర్నాట్ జీ" అను పట్టణానిని జర్మను రుమేనియను సైన్యాలు పట్టుకొన్నవి- ప్రథ్ నదివద్ద తీవ్రమయిన పోరాటములు జరుగుచున్నవి. గతసంవత్సరము రష్యావారు ఫిన్లెండుతో యుద్ధముచేసి వారిదేశములోని "హంగో" రేవును పట్టుకొనియుండిరి- దానిని ఫిన్నులు మరల లాగుకొనుటకై యచ్చట యుద్ధముచేయుచున్నారు-ద్వీనానదియొద్దను లెపల్ పట్టణమునొద్దను తీవ్రమయినయుద్ధములు జరుగుచున్నవి, రష్యాసైన్యము బుకవీనాలోని కర్నాట్ జీ పట్టణమునుండి వదలిపోవలసివచ్చినది. దానిని ఖాలీచేసిపోవుటకు ముందు రష్యావారు పట్టణమునంతయు నిప్పుముట్టించికాల్చివేసిరి, యుక్రేనులో తీవ్రమయిన పోరాటములు జరుగుచున్నవి. రష్యన్ సైన్యాలు ఖండఖండములుగా దాగియుండి అచ్చటచ్చట జర్మనులతో కూటయుద్ధములు చేయుచున్నవి

జూను ౨౨ నుండి జూలై వరకు జరిగినయుద్ధములో జర్మనులు రష్యావారి ౩ లక్షల సైనికులను ఖైదీలుగా పట్టుకొన్నామని ప్రకటించినారు. రష్యావారి ౫౦౦ మోటారులారీలను ౧౭ రైలుబండ్లను 'జటోమిర్' అను నగరమువద్ద మాత్రమే ధ్వంసమొనర్చితిమనియు రష్యావారికి సంబంధించిన ౫౨ వేలసైనికులు రష్యాపక్షమునువదలి జర్మను సైన్యములో చేరిపోయిరనియు, హంగరీ సైన్యము నీస్టరునదివరకు వచ్చినదనియు జర్మనీవారు ప్రకటించియున్నారు-

### అబిసీనియా యుద్ధము

అబిసీనియాలోని సిడామో అను పట్టణములో ఇటలీకివాని తన యావత్తు సైన్యముతో కూడ యింగ్లీషువారికి లోబడి ఖైదీయైనాడు-దీనితో అబిసీనియా యుద్ధము ముగిసినది. ఈయుద్ధములో ఇటలీవారి ౨ లక్షల సైన్యము నశించినది. ఇట్టుట విశేషముగా హిందూస్థానీయ సైన్యమే యుద్ధము చేసినది.

### సిరయా ముగింపు

సిరియాలో హిందూస్థానీ సైన్యమే విశేషముగా ఫ్రెంచివారితో యుద్ధముచేయుచున్నది. ౫ జూలయినాడు దాయిరుజ్జోర్ పట్టణాన్ని హిందూస్థానీసైన్య మాక్రమించుకొనినది, దానితో తూర్పుసిరియా యంతయు ఇంగ్లీషువారి వశమైనది.

ఉత్తరములో బేరూట్ పట్టణము నింగ్లీషువారు ముట్టడించినారు. దానిని ఫ్రెంచివారినుండి యింగ్లీషువారు తొందరగా లాగుకొను సూచనలున్నవి, ఒకవారంలోపల ఫ్రెంచి ప్రభుత్వము వారు యుద్ధవిరామ సంధిని యింగ్లీషువారితో చేసికొన నున్నట్లు తెలియుచున్నది.

### జర్మనీపై దాడి

ఇంగ్లీషువిమానదళములు ఎక్కువసంఖ్యలో జర్మనీదేశములోని ముఖ్యనగరాలపై బాంబులు వేసినవి. ౪ శత్రునౌకలను ముంచినారు. ఫ్రాన్సులో జర్మనువారాక్రమించుకొనిన భాగములపై బాంబులువేసినారు జర్మనీవారి ౬ నగరాలపై ఇంగ్లీషు విమానాలు తీవ్రముగా బాంబులు వేసినవి,

## బంగారుపాతరతీయుట

### పోలీసుకాపలా

వరంగల్లు

(స్వ-వి)

వరంగలులో స్టేషన్ రోడు టపాఖానా ప్రక్కన గల, ఆకారపు వెంకన్నగారి పాతగిర్నీలో, శిల్పపనివారలు రాతిచెక్కడము చేయుచుండిరి, నాలుగురోజులక్రిందట రాజ[ర్షి]ఆకారపు నరసింగంగారిగుమస్తాయగు గంపారాజయ్యమరియు శిల్పపనివారలు ౫౬ గురు కలసి ఒకగొల్లవానిని కూలికిగాను పిలుచుకొని, రాత్రిపూటకై గిర్నీ ఒకమూలకువెళ్లి మంత్రోక్తముగా "గుహ" రమునిచ్చి సు మారు గజమున్నర త్రవ్వగానే గడ్డపారకు యేదోతాకినట్లుతోచినను మరియొక ప్రక్కను గడ్డపారవేయగా పెద్దచప్పుడు అనగా "ఢాం" అని వినవచ్చెనట. అంతట నాగొల్లవాడుచక్కలరక్తము గక్కి, మూర్ఛనొందెను, తర్వాత గొల్లనుబండిలోనెక్కించి సర్కారీ దవాఖానాకు చేర్చిరి. ఆటుతరువాత యేమి జరిగెనో తెలియదు,

మరునాడు గొల్లను డాక్టరు పరీక్షచేసియేరోగములేనందున నెత్తురుకక్కడము కారణము యేమనిగొల్లనువిచారించగా పైవిషయమువివరముగా తెలిపెను. ఈసంగతి అమీనుగారికి తెలియపరచినవెంటనే వారు కొందరక్షకభటులతో. సహా స్థలముపరిశీలించి అనుమానముపై పోలీసు కాపలాఉంచబడెను. తర్వాత గంపా రాజయ్యను మరికొందరిని శిల్పిపనివారలను అరెస్టుచేసి పరిశోధనచేయుచున్నారు. కొన్ని బంగారు కడ్డీలు దొరికినవని వారుచెప్పినట్లు తెలుస్తున్నది.

## వైస్రాయిమంత్రి వర్గములో మార్పు

### సర్ హైదరీగారిపేరు సూచన

హంసపత్రికలో యీవిధముగా వ్రాయబడినది:

వైస్రాయిగారి ఎక్జిక్యూటివుకౌన్సిలులో మార్పులుజర్గునని వదంతులున్నవి. సర్ జఫరుల్లా గారి స్థానములో సర్ సుల్తాను అహమద్‌గారిని ఏర్పాటుచేయుదురట- కౌన్సిలుసభ్యులకు ప్రతివానికి సంవత్సరమునకు ౮౦౦౦౦రూపాయిల జీతమిచ్చుచున్నారు. ఇకముందువానిని ౬౦౦౦౦రూపాయిలవరకు తగ్గింతురని అనుకొనుచున్నారు. ముఖ్యమైనశాఖలలో మార్పుఉండదట, హోము డిపార్టుమెంటు మంత్రిపదవిని హిందూస్థానీలకి వ్వరట: సర్ వాక్బరుహైదరిగారిని సంరక్షణశాఖామంత్రులుగా ఏర్పాటుచేయుదురని వదంతులున్నవి, ఎక్జిక్యూటివు మంత్రిసభ్యులలో ౧౧మంది మంత్రులను ఏర్పాటుచేయుదురట. అందు ఏడుమంది హిందూస్థానీలుందురట-

## 'బొమ్మల పెండ్లి'

### 'అమ్మాయిల :వారి. జనకుల పేర్లు'

౨౮-౯-౫౦ తేదీన గోలకొండపత్రికలో ప్రకటించినవిషయము సమస్తజనులకు విశదమే," అడబొమ్మ" పక్షాన ఆల్లాడి రాజయ్యగారి కుమార్తె "వీరలక్ష్మి" అను బాలికయును "మొగబొమ్మ" పక్షాన తోటకిష్టయ్యగారి కుమార్తె" "రాజ" అను అమ్మాయియును తమ బొమ్మలపెండ్లి తంతును పూర్తిచేసినతరువాత బ్రాహ్మణభోజనాలు జరిగెను-తదనంతరం సంభావనలు ఇయ్యబడెను. వైశ్యులకుగూడా గొప్పవిందు జరిపిరి. పైఅమ్మాయిలకుపూర్వమే బాల్య వివాహములుగూడా జరిగియుండెను.

## తిరువాన్కూరులో విద్యుత్తు

తిరువాన్కూరుసంస్థానమువారు పల్లివాసల్ అనుస్థలములో ఎలెక్ట్రిసిటీ ఉత్పత్తిచేసేనిమిత్తం ఒకహైడ్రోఎలెక్ట్రికుయంత్రాన్ని ఏర్పాటుచేసియుండిరి,దానినిప్పుడింకావృద్ధిచేయుచున్నారు-దానిసహాయంతో అల్యూమినంకంపెనీ కొన్నిలక్షలతో సిద్ధమగుచున్నది. ఆసంస్థానంలో ఇంకా చాలాపరిశ్రమలు ఈవిద్యుత్తుతో ఏర్పాటుకానున్నవి.

## మార్కెటులో నోటీసు

వరంగల్ గ్రయిన్ కోటన్ మార్కెటులో ఒకవాలుపేపరు అంటించబడ్డది. అదిఏమనగా: (భద్రాచలం శ్రీరాములవారి దేవాలయములో (౪౦)తులముల బంగారము దేవాలయకమిటీఅండ్ వేలంవేయబడును. అవసరముగలవారలు పాల్గొనవచ్చును" అని దానిపైవ్రాసినారు. ఇదియేమికారణమో తెలియడములేదు.

## నిజాంరాష్ట్రపద్మశాలి యువజన సంఘసభ

ఈఆదివారం ౧౩వ సరియగు 11జూలై శుక్రవారము సాయంత్రము ౫ Kంటలకుండి నారాయణగూడ డిస్టలరీ కంపౌండులో "భానుదేవర క్కాల . . . యుర్వేదపాఠశాల" యందు వర్తమానకాలమందు పద్మశాలీయుల కర్తవ్యము అనువిషయముపై ఉపన్యాసములు జరుగును పద్మశాలీయులెల్లరు పాల్గొనగలరని ప్రార్థన.

ఇట్లు

ని. రా. పద్మశాలి యువజనసంఘముతాలూకు

## బొంబాయి హైద్రాబాదుల మధ్య రైల్లు

యస్. యస్. రైల్వేచీఫ్ కమ్మిషనర్ . . . జరుగారు, బొంబాయి. హైద్రాబాదుల మధ్య రైలుదారి యింకను సరిచేయబడి తేదనియు,వి . . . రు, బతోడాలమధ్యవ్యాపారమంతయు ఆగిపోయినదనియు, ప్రస్తుతము తపతివ్యాలీ రైల్వేలోని కొన్ని స్టేషన్లకు మాత్రము సరుకుల ఎగుమతి దిగుమతులు జరుపవచ్చుననియు తెలుపుచున్నారు

## శ్రీ చావా వెంకటకోటయ్య గారు

ఆంధ్రజనసంఘమునకు
రాజీనామాయిచ్చుట

(ఒ-వి)

ఖమ్మంమెట్టు ౨౬-౯-౫౦

ఖమ్మంమెట్టునివాసులును రైతుసేవకులైన శ్రీ చావా వెంకటకోటయ్యచౌదరిగారు వరంగలుజిల్లా ఆంధ్రజనసంఘ కార్యదర్శినిర్వాహక సభ్యత్వమునకు రాజీనామాయిచ్చినట్లుగా తెలియుచున్నది. చిలుకూరు ఆంధ్రమహాసభ ఆంధ్రపద నిర్వచనము మార్చినందుకు అభిప్రాయభేదముచే ఆంధ్రజనసంఘమునుండి వదలినారని తెలియుచున్నది.

## శ్రీ ప్రతాపరుద్ర ఆంధ్రభాషానిలయము

పానగల్లు నల్లగొండజిల్లా ౪-౭-౪౧

ఇచ్చట శ్రీప్రతాపరుద్ర ఆంధ్రభాషానిలయము పేర ౫ సంవత్సరములనుండి గ్రంథాలయము నడచుచున్నది. రెండు సంవత్సరములక్రితము రెండు వందలరూపాయిలు చందాలుప్రోగుచేసి స్థలముకొని ఒకగది పుస్తకశాలగా నిర్మింపబడినది. ఈ వేసవికాలములో నల్లగొండఆంధ్రప్రముఖుల మరియు పానగల్లుఅభిమానుల ఉదారదానముచే ౧౦౦౦ రూపాయిలవెండచాలుప్రోగుఅయినవి.ఆధనముచే హాలునిర్మింపబడినది ఇందులో శ్రీయుత అక్కినేపల్లి వెంకటరామారావు దేశముఖుగారు మిక్కిలిప్రశంసనీయులు. వారిసహాయకులుగానుండిన శ్రీ పి. రామానుజాచారిగారు యఫ్.ఏ. మరియు శ్రీ భట్టారాంచంద్రులుగూడా ప్రశంసనీయులు. నేటికిగ్రంథాలయమునకు వాల్గువందల స్వంతభవనము కుదిరియున్నది.

యీసంవత్సర అషాఢశు॥ 3 లు శుక్రవారంతో యీ గ్రంథాలయ గ్రంధపాలకులుగా నకసంవత్సరము అమితోత్సవముతో సేవజేసినయువకులగు శ్రీయుత మదనాచారిగారు అకాలమరణమొందినందున గ్రంథాలయానికి తీరనినష్టముకల్గినది. వారిఆత్మకు శాంతి. చాలుఅమితోత్సాహులు, యువకులు.

## కలరా వ్యాపకం

(స్వ-వి.) మార్యాపేట, ౨౬-౯-౫౦

మాగ్రామములోనూ చుట్టుపట్లనున్న కోటపాడు రావిపాడు రాఘవపురము మొదలగుగ్రామములలోను కలరావ్యాధి ప్రబలుచుండుటచే ప్రజలలో అధిక సంచలనము, ఆందోళనంబయులుదేరినవి.

పరిస్థితులువిషమించినవి. సఫాయియుద్యోగులును వైద్యశాఖవారును శ్రద్ధ తీసుకొనుటఅవసరము. బావులను రోడ్డులను మురికికాలువలను శుభ్రపరిపింపకలేనియున్నది. వ్యాధిపీడితులకుసరియైనచికిత్సకై ఏర్పాట్లుచేయుటఅత్యవసరము. వీధిదీపములు అమావాస్యదినములలోనైన సరిగాలెలుగవు. నిన్నటేడు సర్కారీ వైద్యాలయంవారు కలరాఇంజక్షనులు ఇవ్వమొదలిడినారు.

ఇద్దరువిద్యార్థులకు కలరావ్యాధితగిలినది, నేటి ఉదయము ౪వ తరగతి పిల్లవాడొకడుచనిపోయెను, మూర్ధన్యోపాధ్యాయులుగారు 3 జూలైనుండి ౧౫ జూలైవరకు సెలవులు ప్రసాదించినారు-

## డాకూరు

ఆర్యసమాజ స్థాపన.

(ఒ- వి.)

౨౨ అమర్దాదు ౧౩౫౦ ఫ సాయంత్రము మెదకుజిల్లాలోని డాకూరుగ్రామములో సభచేయబడెను. సు॥ (౧౦౦) మందివచ్చిరి. పండితజయదేవు సిద్ధాంతరత్న గారు- ౫మందికి యజ్ఞోపవీతసంస్కారములు జరిపిరి, పం॥ జయదేవుగారు స్వహస్తములతో ఓంకారధ్వజారోహణ చేసిరి. కర్యాతయువకుల భజనలుజరుపబడెను. తదనంతరము, శ్రీయుతబుచ్చిరెడ్డి, శ్రీగోవిందరావు శ్రీనాగయ్య. శ్రీఅగప్ప శ్రీజ్ఞానేంద్రజీ ఉపన్యాసములిచ్చిరి,

ఆర్యసమాజ కార్యకర్తలఎన్నికలు

ప్రధాన శ్రీయుత, యం, బుచ్చిరెడ్డి గారు

ఉపప్రధాన శ్రీయుత, యం, రాములు గారు.

మంత్రి శ్రీయుత, వి, రామమూర్తి గారు.

ఉపమంత్రి శ్రీయుత, యన్, రంగయ్య గారు.

కోశాధ్యక్షులు. శ్రీయుత, యమ్, బ్రహ్మయ్య గారు,

పుస్తకాధ్యక్షులు, శ్రీయుత, పి, రాంచందర్ గారు,

## విద్యార్థిసంఘము

ఖమ్మంమెట్టు

శ్రీజ్ఞాన విద్యుత్ప్రవాహినాంధ్రభాషానిలయము అనుపేరుతో నొకగ్రంథాలయము ఖమ్మముమెట్టునందు సుమారు ముప్పదిసంవత్సరముల క్రితము స్థాపింపబడినది. స్థానికముగనేగాక నైజాంరాష్ట్రమందు పేరెన్నికగన్న గ్రంథాలయములలో ఇది యొకటిగానుండెడిది. ముఖ్యకార్యకర్తల ఉత్సాహము తగ్గుటచేతనో మరియితరకారణములవల్లనో యీభాషానిలయము విద్యార్థులకరణుకొచ్చెను. సుమారు ౧౨ వత్సరములమునుండి యీగ్రంథాలయము "విద్యార్థిసంఘము"అనుపేరుతో వ్యవహరింపబడుచూ కాలచక్రమును దొర్లించుచున్నది. ఎన్ని ఒడుదొడుకులువచ్చినను యీగ్రంథాలయము స్వంతభవనము లేకపోవుటచే కలిగియుంటుటచే దీపారాధనచేయుటకైనను అస్కారముకలిగియున్నది. ధనాధికులు, న్యాయశాస్త్రవేత్తలు భిషగ్వరులు ఎందరో దీనికడుపున్న అవసరించుచున్నారు. కాని దీనియభివృద్ధికై మనస్ఫూర్తిగా కృషిసల్పినవారు అరుదు. ఆలయమందలి గ్రంథములు జీర్ణించుచున్నవి. నూతనగ్రంథసము పార్జనకు అవకాశములులేవు. నాల్గుసంవత్సరముల నాడు శ్రీ పండితనారాయణరావు సుబేదారు బహద్దూరివారి అధ్యక్షతన అతివైభవము గారజతోత్సవము జరుపబడినది. స్థాపకులలోనొకరగు శ్రీ ఇటికాల రాజేశ్వరరావు వకీలుగారును శ్రీజమలాపురం వెంకటేశ్వరరావు వకీలుగారును చాలాశ్రమతో వృద్ధికి తెచ్చినట్లును, భవననిర్మాణమున శ్రీఆరవపల్లిరామదస్సు, శ్రీ ఆకుల పూర్ణానంద మొదలగు వర్తకప్రముఖులుగూడా సాయముచేసినట్లును గానబడుచున్నది. యీతవాకిళ్ల నారాయణరావుగారు వేముగంటిరామకిషన్‌రావుగారును మరియొందరోప్రముఖులు చేయూతనిచ్చినట్లును, ఈభవననిర్మాణము పింగళనామసంవత్సరమునకు పూర్తిఅయినట్లునుకలదు. ఈప్రముఖులందరును నేటివరకును దీనియందు అభిమానమును జూపుచునేయున్నారుకాని దీనియభివృద్ధిమార్గముల గమనించుటలేదు.

ఇటీవల శ్రీఇటికాల రాజేశ్వరరావుగారి (నిలయస్థాపకుల) కుమారులు వీరభద్రరావుగారు కార్యదర్శిగా నియమింపబడిరి. వీరుతమజనకునివలెనే కార్యభారమును నిర్వహింపగలవారు. ఇట్టి తరుణమందైనను చిన్నలు పెద్దలుఅందరును చేతనైనంత చేయూతనొసంగి వారికృషిని అభివృద్ధిపరచప్రార్థన. ఈభాషానిలయము భగవంతునికరుణచే తనపూర్వపు ఔన్నత్యమును బడయుగాక,

## శాసనము

ఇంతకుముందు గోలకొండ పత్రికలో పత్తేపురంచెరువుసమీపమున పురాతనమైన శాసనము ఉన్నదని పరిశోధకులువచ్చి పరిశీలించగలరని ప్రకటించబడియుండెను, కాని నేటివరకుయేపరిశోధకుడుదయచేసియుండనందున చాలా చింతిల్లుచుంటిని. ఈ పరిశోధకులు దయచేసినవారికి భోజనసౌకర్యములు చక్కగా జరుగగలవు.

ఇట్లు
కోటగిరిరావు
పత్తేపురం మాలారుమగరు తాలూకా
నల్లగొండజిల్లా-

## హరిజన పాఠశాల

కామారెడ్డి

ఇచ్చట సుమారు ౫మాసముల క్రిందట హరిజనబస్తీలో నొక రాత్రిపాఠశాలస్థాపించబడెను. దీనిమూలపురుషుడు శ్రీయుత నర్సాగౌడు ముస్తాజరు కామారెడ్డిగారుఅని చెప్పవచ్చును. వీరు ఔదార్యగుణముచే కొన్ని నెలలవరకు ప్రతినెలకు సుమారు పదిరూపాయలచొప్పున ఖర్చులు భరించుచు పాఠశాలను సక్రమముగా నడిపించిరి. దీని స్థాపితము..సాహాయ్యము మంజూరినిమిత్తము శ్రీ విద్యాశాఖమొహతెమీం జిల్లానిజామాబాద గారివద్దికి హరిజనులపక్షమునుండిదరఖాస్తుపెట్టగా ఇప్పుడు స్థాపితమునుగురించి మాత్రమే నిన్నటి (౨౩౯౬) తేది..౮౪అమర్దాదు సన్౧౩౫౦ఫస్లిద్వారమంజూరి శ్రీ సదరు మొహతెమీం గారు ఔరంగాబాదమండిరాబడెను. ఈపాధ్యాయుని జీతన (యింటాది) నిమిత్తముగూడ కార్యాయి జరుపబడుచున్నది.

ముస్తాజరుగారు కొన్ని ఇబ్బందులవల్ల పాఠశాలకు కావలసినంత సహాయము చేయజాలనందున సక్రమముగాజరుగుచున్న బడి నిలిపివేయగూడదని ఈగ్రామములోని కొందరు విద్యాభిమానులు, త్యాగపురుషులు ప్రతినెలకు సహాయము చేయుగలమని చందాను వ్రాసిరి.

పాఠశాల గృహము

ప్రస్తుతమొక పూరి గుడిసెలో ఈ హరిజన పాఠశాలపనిచేయుచున్నది. దీనిగృహమునకై దరఖాస్తు శ్రీతహశీలుదారు కామారెడ్డిగారివద్ద కొద్దిదినములలో పెట్టబడుచున్నది.హరిజనబస్తీలోనే యొకమైదానుగలదు. దానిలో నిర్మించుటకు ప్రయత్నము చేయబడును. కొందరు గృహనిర్మాణ నిమిత్తముగూడ సహాయముచేయు వాగ్దత్తమిచ్చియున్నారు.

బాలుర సంఖ్య

ఇప్పుడు సుమారు౫౬విద్యార్థులు రాత్రి౭గంటలనుండి ౯గంటలవరకు చదువుకొనుచున్నారు. ఒగురు మూడవతరగతి ఒగురురెండవతరగతి ఒగురు మొదటితరగతి, మిగతబాలురు ప్రారంభదశయందుచదువుకొనుచున్నారు. ౫మాసములలో విద్యార్థులు చాలమంచిస్థితికివచ్చుట, ఇచ్చట పనిచేయుచున్న శ్రీదుర్గాదాసు హరిజనుని పరిశ్రమయే..రా తియూడుగంటలు ఇతడుతనజాతి ఔన్నత్యమునకుపాటుపడుచు జీతమునుకేకుండనే విద్యార్థులకుబోధించుచున్నారు ఇట్లేఇంకకొందరు హరిజనయువకులుబయలుదేరి జాతిసేవచేసిన యెడల తప్పక హరిజనులు మంచిస్థితికి రాగలరు. హరిజనోద్ధారకులగు నాయకులుకూడఇచ్చటికివచ్చి పాఠశాలనుదర్శించి తమ అమూల్యాభిప్రాయములచే తనుసహాయముచేతను ఈపాఠశాలనుకాపాడి వృద్ధికితెచ్చుటకై తోడ్పడగలరని వేడుచున్నాను.

ఇట్లు
ఎం. ఎల్. గుప్త.

# గోలకొండపత్రిక

వృషనామసం॥ర ఆషాఢ బ॥ ౨

గురువారము


## అఖండ హిందూస్థానము

కొన్ని సంవత్సరాలనుండి రగులు తూఉండినట్టి పాకిస్థాన సమస్య యుద్ధంవచ్చినతర్వాత మరింత తీవ్రరూపము దాల్చినది. ముస్లింలీగు వారు మాకు పాకిస్థానమే కావలెను అని అంటున్నారు. కాని పాకిస్థానమంటే యేమి? అదెంతవరకు లాభకారి? దాని అవసరమేమి? అది తర్కయుక్తముగా నుండునా లేక చిత్తుఅయితే నేను గెలుస్తాను బొత్తుఅయితే నీవుఓడుతావు అనే తర్కము మాత్రమేనా? అనే విషయాల పై ఏకారణంచేతనో ముస్లింలీగు నాయకులు శాంతంగా న్యాయబుద్ధితో ఆలోచించకపోయిరి.

హిందువులు మునల్మానులు ఇద్దరును భిన్నభిన్న జాతులని ముస్లింలీగువారందురు. నిజముగా ఆలోచించితే ఇది అబద్ధమని దృఢపడును. హిందూస్థానములోని మునల్మానులలో నూటికి ౯౫ మంది, హిందువులనుండి యేర్పడినట్టివారే. అట్టిమార్పుకు తోడ్పడిన హింసాత్మకాచారాలును, దేశచరిత్రయున్నా. మరియు యిట్టి యితరకారణాలనుగురించి యిప్పుడు చర్చించనవసరములేదు. మతములు భిన్నమైనంతనే జాతీయతలో భిన్నమున్నదను వాదన మనదేశమందే కానవచ్చుచున్నది. యూరోపు ఖండములో యహూదీలు, క్రైస్తవులు, మునల్మానులు ఒక్కొక్క ప్రాంతములో కలిసియున్నారు. కాని వారే దేశమందుండురో ఆదేశజాతిగా భావించుకొనుచున్నారు. ఆదేవిధముగా చీనా జపాను దేశాలలో ను బౌద్ధులు, మునల్మానులు, కణ్ఫ్యూసియనులు, ముష్నగుమతాలవారున్నారు. అందులోను చిత్రమేమనగా ఒకే కుటుంబములో భర్త బౌద్ధుడున్నా భార్య ముస్లిమున్నా కొడుకు కణ్ఫ్యూసియనున్నా అయియుండుటకూడా కలదు. అట్టికుటుంబాలలోగాని, అట్టిదేశములోగాని బౌద్ధ మునల్మానుకలహాలు చెలరేగుటలేదు. దొంగపోట్లను పీవునపొడుచుటగాని, చీకటిలో లాఠీలతో నెత్తులు పగులగొట్టుటగాని, యిండ్లను, దుకాణములను తగులబెట్టుటకాని, స్త్రీలను చెరచుటకాని, శిశువులనుగూడా చంపుటకాని చీనా జపాను దేశాలలో జరుగుచున్నట్లు ఎన్నడును వినుటలేదు. కాని మనహిందూస్థానములో ఏదినముచూచినను ఏదోయొక ప్రాంతములో హిందూముస్లింకలహాలుజరుగుచుండునట్లు అందు ఉభయవర్గాల గుండాలు రాక్షసులవలెవర్తించుకొనుచున్నట్లును వార్తలను వినుచుందుము. ఇట్టి కలహాలకు పాకిస్థాన్ రానురాను తలవని తలంపుగా దోహద మిచ్చునదై యుండును. "మీరువేరు మేమువేరు. మీరు అధికసంఖ్యాకులుగా ఉన్నారు. మీకు మేము గులాముగా ఎట్లుండగలము. స్వరాజ్యమంటే హిందూరాజ్యమే. మాకు వేరేరాజ్యం కావలెను. మీకు మాకు పొత్తుకుదురదు. మేము అసల్ మలికులము. మేము ౬౦౦ వండ్లనుండియో ౮౦౦ వండ్లనుండియో ఈ దేశాన్ని జయించిపాలించినాము." అనుసిద్ధాంతము ఒకదిక్కు ముస్లింలీగువారును ఇంకొకదిక్కు ఇత్తెహాదువారును ప్రచారముచేయుచుండిన దేశములో ఐకమత్యమెన్నటికైనా కుదురునా? అందరమును ఇప్పుడు బానిసలమే! అన్న మూలసిద్ధాంతాన్ని మరిచిపోవుటవలనను హిందూ మునల్మానులు పరస్పరం కొట్లాడుచుండుటవలనను ఈ బానిసతనాన్ని శాశ్వత పట్టాగా ధృవపరచడమగుచున్నది.

మనదేశ దురదృష్టముచేత మన నాయకులలో చాలామంది మతావేశ పూరితులే లభించినారు. మతావేశపరులు ప్రజానాయకత్వం వహించితే మత కల్లోలాలు అభివృద్ధియగుచుండును. కాని నాయకులు మాత్రము సురక్షితంగానే ఉందురు. నష్టపడునది బీద హిందూ మునల్మానుప్రజలే! రాజకీయములలో మతాలనుకలిపి ఆదృష్టితోనే ఆర్థిక, సాంఘిక విద్యావిజ్ఞాన విషయాలనన్నింటిని పరిశీలించుటవలన కలుగు ఘోరపరిణామము కన్న మించిన హాని మరి వేరు లేదు. మతము ప్రతివాని ఇంటిలోని ముచ్చటగాను మించితే మశీదు దేవాలయములలోని ముచ్చటగాను ఉండవలసినది. కానిదానికి బళ్ళలోను, సభలలోను, రాజ్యాంగములోను స్థానములేదు. ఈయంశాన్ని యిప్పుడు చాలామంది నొక్కిచెప్పుచున్నారు కాని ఆచారంలోమాత్రము మల్లీ మతదృష్టి యేవ్యక్తమగుచున్నది. ఇటీవల పూజ్యులును సర్వజనప్రియులును అయిన మ.ఘ.వ. నిజాంప్రభువులుంగారు మతము వేరు, రాజకీయము వేరు రెండునుకలియనేరవుఅని సెలవిచ్చియుండిరి. ౧౨ వండ్లకుపూర్వమే శ్రీ ప్రభువులుంగారు తమమతము ప్రజాక్షేమమును మతమే అని సెలవిచ్చియుండిరి. శ్రీవారి భావ గభీరత నెందరర్థముచేసికొన్నారు? మన దేశములోని నాయకులు తుదకు హైద్రాబాదు హిందూ ముస్లింనాయకులు శ్రీప్రభువులుంగారి నీతిబోధను చక్కగాగ్రహించి మనఃపూర్తిగా ఆచరించుకొనినట్లైన దేశములో శాంతికి భంగమెన్నడును కలుగనేరదు.

గతవారము కే. యం. మున్షీగారు అఖండహిందూస్థానముకొరకై హిందూ, సిక్కు, క్రైస్తవ, మునల్మానులందరున్నూ గట్టిగా ప్రయత్నము చేయవలెననుటకు వారు చూపించిన కారణాలు గమనింపతగినవై యున్నవి. పాకిస్థానము అఖండహిందూస్థానానికి విరుద్ధమైనట్టిది. ఈప్రాచీనదేశాన్ని తునుకలు తునుకలుగాచేసి, విభాగింతుము అను వాదముచేయువారు పోరాడు పిల్లలకున్న గడ్డను కోతివిభజించియిత్తునని చెప్పి తూకముచేసి ఈతట్టుయెక్కువఉన్నదని ఒకముక్కను మరియీతట్టు ముల్లుమొగ్గినదని ఇంకొంకముక్కను ఈవిధముగా సాంతముగాతినివేసిన కథను జ్ఞాపకము చేసుకొందురుగాక. మనముండేది పేరునకు హిందూస్థానము. మన సోదరులు కొందరుండగలచుకొన్నది పాకిస్థానము. కాని యిప్పుడు మనమునిజముగా ఉండునట్టిది గులామిస్థానము. అందరును హిందువులుకాని, మునల్మానులు కాని, సిక్కులుకాని, క్రైస్తవులుకాని, ఎంతివరకీదేశమునాది. ఇదినాజన్మభూమి, "జననీజన్మభూమిశ్చ స్వర్గాదపిగరీయసీ" ఈ నా మాతృభూమికై నేను సర్వమును అర్పించుకొన సంసిద్ధుడను. అందరము హిందూస్థానీలమే. మనముసోదరులము. అనుభావనల కలవారైయుండరో అంతవరకు గులామిస్థానమే మనపాలిటి స్థిరస్థానమై యుండును.

---

## రాజ్యాంగ సంస్కరణలు

హైద్రాబాదులో త్వరలో ప్రవేశ పెట్టబడునట

హైద్రాబాదు రాజ్యాంగ సంస్కరణలు ౨౭౨ాతైనాడు అనగా మ- ఘ- వ- నిజాంప్రభువుగారి జన్మదినమునాడు ప్రవేశపెట్టబడునని యు అందుకు గానుఅవసరమైన ఉపనియములన్నీ సిద్ధమైనవనియు, రాజ్యాంగసంస్కరణలప్రకారమే ఎన్నికలు జరిపించినచో ఆలస్యమగుననియు, అందుచేత వ్యాపారులను పాల్ కొరులనుమున్న గువర్గాలవారినికొన్ని పేరులనునామించుమరియు అట్టిపేరులుకలవారిని శాసనసభలో సభ్యులనుగా విర్ణయింతురనియు అట్టిశాసనసభకు సర్ మహమ్మద్ యాఖూబ్ గారు స్పీకర్ గానియుక్తులగుదురనియుచాలాగట్టి వదంతులున్నవని దక్కన్ క్రానికలులో ప్రకటించినారు.

---

## ఆంధ్ర యువజన సమితి

హైదరాబాదు (దక్షిణ)

సైసమితివార్షికోత్సవసందర్భమున ఈ దిగువ పోటీలు ఏర్పాటుచేయబడినవి.

వ్యాసరచనపోటీ విద్యార్థినులకుమాత్రమే ప్రత్యేకింపబడినవి.

విషయము_"ఆర్థిక, సాంఘిక, కళ, మరియు శిశుపోషణదృష్టితో గృహనిర్వహణమందు స్త్రీలు ఎట్లు సహాయపడగలరు.

వ్యాసములు (అంపుటలకుమించకుండా) ౩౧వ జూలైవరకు కార్యదర్శివద్దకు పంపవలెను.

వక్తృత్వపోటీ స్త్రీపురుషులెల్లరును పాల్గొనవచ్చును. రెడ్డివసతిగృహములో ౩వఆగష్టు గురువారంనాడుసాయంత్రము ౫_౩౦ గంటలకు జరుగును_పాల్గొనువారు తమనామములను ౩౧వజూలై వరకు కార్యదర్శివద్దకుపంపి వివరాలు తెలుసుకొనవలెను,

కె- మాధవరెడ్డి

కార్యదర్శి

"శ్రీంసదనము" ఫీల్ ఖాన హైద్రాబాదు

---

## బహద్దరు యార్జంగు

నవాబు బహద్దరుయారుజంగుగారు ఇటీవల బొంబాయికిప్రత్యేకముగా జిన్నాగారితో కలియుటకు వెళ్ళియుండిరనియు జనాబ్ జిన్నాగారు నవాబుగారికి హితవుచెప్పిరనియు, మ- ఘ- వ- ప్రభువుగారి ఆజ్ఞాపరిపాలనలోఉండుట ఆతనికి తగినచర్యయని బోధించురనియు అందుచేతఇకముందు ఇత్తెహాదుల్ ముస్లిమీను అంజామనువారు రాజకీయాలలో ఘాటుగాపనిచేయక సంఘనిర్మాణకార్యములో ఎక్కువశ్రద్ధతీసు కొందురనియు అనుకొనబడుచున్నదని దక్కన్ క్రానికల్ లో వ్రాసినారు.

---

జమ్నాలాలు బజాజుగారు

సేటుజమ్నాలాల్ బజాజ్ గారు హైద్రాబాదులో ఖాదీపరిశ్రమవిచారించుటకై యింతలో రానున్నారని తెలియవచ్చుచున్నది.

---

## దేశరక్షణమే ముఖ్య కర్తవ్యము

## హిందూముస్లిములయైక్యత అవసరము

ముస్లిం విద్యార్థులకు సర్ సికందరుగారి హితబోధ

జూలయి ౫వతేదినాడు పంజాబు రాష్ట్రియలోని లిలుపూరులోఉండిన ముస్లిం విద్యార్థిసంఘమువారి సభజరిగినది. సభకు పంజాబు ప్రధానామాత్యులు సర్ సికిందరుహయాతుఖానుగా రధ్యక్షతవహించారు చాలామంది విద్యార్థులుపాల్గొన్నారు. విద్యార్థులు చాలాఉద్రేకంతో మాట్లాడారు. అవసరమయితే పాకిస్థానముకొఱకు తమ ప్రాణాలనుకూడా త్యాగంచేయుటకు సిద్ధముగా ఉన్నామనికూడా కొంతమంది విద్యార్థులన్నారు, చాలమంది నోటినుండి "ముస్లిం రాజ్యం" అనే కేకలుకూడా బయలుదేరినవి. విద్యార్థుల యీ అవినీతియుత ప్రవర్తనకు సర్, ఖానుగారు చాల అసహ్యించుకొని వారిని తీవ్రంగా మందలిస్తూయిట్లన్నారు.

"మీరందరూ పొంగుపాలవంటి వయసులో నున్నారు_అయినా నేను మీకు కొన్ని యథార్థతత్త్వాలు చెప్పదలచితిని_ నేనుచెప్పబోవువాక్యములు పవిత్రమయిన ఖురానుకు సమ్మతములు. వాటినిదిని మీరు శాంతంగా ఆలోచించండి.

౧ "ఇస్లాంమతములోనికి యితరమతములవారిని కలుపుకొనువిషయములో పూర్వులువారికి కత్తులుకటారులుచూపి బెదరించి బలవంతంగా చేర్చుకొనియున్నారేగాని వారికినచ్చచెప్పి వారి అంగీకారంతో తమమతములో కలుపుకొని యుండలేదు. చంపుతామని బెదరించుటచే ప్రజలు తమకిష్టములేకున్నను భయపడి యిస్లాంమతములో చేరుతూవచ్చినా"రని ఆ సేకులుఅంటూవుంటారు_కాని అదిఅయథార్థం. ఇదేయథార్థమయితే ఢిల్లీనగర ప్రాంతాలలో ఇప్పుడు హిందూప్రజల సంఖ్య యింతయెక్కువగా ఉండియుండదు, ఏమంటే ఢిల్లీనగరం ముస్లిములరాజధాని_ మహమ్మదీయప్రభువుల సేకశాబ్దములు ఢిల్లీ నగరమునందుండియే యీవిశాలభరతఖండాన్ని పాలించినారు. అట్టి ప్రభుస్థానంలోఉన్న ముస్లిములు హిందూప్రజలను బెదిరించి తమమతములోకలుపుకొనుటకే కటకించినట్లయితే ఢిల్లీచుట్టుపట్లులలో ముస్లింజనసంఖ్యయే హెచ్చుగానుండవలెనని వచ్చేదిది

౨ భారతదేశపుప్రాచీనచరిత్రల కొన్నిటిలో అప్పుడు హిందూ మహమ్మదీయుల పరస్పరైకమత్యాన్నిగురించి సరిగా వ్రాయబడలేదు. ఇప్పుడీలోపముతీసివేయుటకు ప్రభుత్వమువారు ప్రయత్నించుచున్నారు. ఎవరయినా, ప్రాచీన భారతదేశచరిత్రను బాగా తెలిసేలాగున వ్రాయగలిగినవారంటే వారికి ప్రభుత్వమువారు మిక్కిలిసహాయపడగలరు.

ముస్లింయువకులు అతినిర్మలప్రవర్తనలుగలుగుండవలెను. ప్రజావిశ్వాసానికి పాత్రులయియుండాలి గౌరవంగా ప్రవర్తిస్తూ ఉండాలి. ప్రాచీనాధునాతనచరిత్రలను అట్టిరాజకీయాలనుకూడా విద్యార్థులు సమగ్రంగా తెలుసుకొనవలెను. —ంతేగాని తమవిద్యాభ్యాసమునకు భంగముకలిగే పద్ధతిలో రాజకీయవివాదములలోపడిపనిచేయరాదు. విషయం సందిగ్ధంగాఉన్నప్పుడు, అందులో సంపూర్ణప్రజ్ఞ తమకు లేనప్పుడూ ఆవిషయాన్ని విద్యార్థులు వదలివేయవలెను.

పాకిస్థానుకు అర్థం?

ఇంతకుముందు ఈసభలో పాకిస్థానునుగురించి చాలమందిముచ్చటించారు, కాని, వారిలో పాకిస్థాను అనేపదానికర్థం తెలిసినవారు కొద్దిమందిమాత్రమేఉంటారు. ఈమాటాడినవారంతా తెలిసినవారేఅయితే ఇంతదుడుకుగామాట్లాడియుండరు. పాకిస్థానువిషయంలో చాలామంది చాలాసార్లు ములనుపత్రికలలోవ్రాసినారు. కానివాటన్నిటికీ పరస్పరవైరుధ్యంకనిపిస్తుంది. నాయభిప్రాయంవినండి. ప్రతిరాష్ట్రములోనూ అధికసంఖ్యాకవర్గాలుతమహక్కులుపూర్తిగా తమరాష్ట్రంలో అమలుజరుపుకునేఅధికారం కలిగియుండాలి, అల్పసంఖ్యాకసంఘములకు పూర్తిగారక్షణలు ఉండవలెను. ఇదినాయభిప్రాయం. కొందరేమంటున్నారంటే ముస్లిములుఅధికంగాఉన్నచోట్ల అక్కడఉన్న అల్పసంఖ్యాకవర్గాలను బాధించుటకుకూడా అధికారముండవలెనట. ఇదిచాలా తప్పు. ఇట్టివారితో నే నేకీభవింపజాలను

"పాకిస్థానుకొఱకు మా ప్రాణాలనుకూడా అర్పిస్తామని యిప్పుడు మీలోకొందరన్నారు. ఇది మనఃపూర్వకముగానే అన్నట్లయితే అట్టిత్యాగానికి తగినసమయం యిప్పుడేవచ్చింది. మహోత్కటులయిన జర్మనీయిటలీ రాజ్యాలవారు ఈజిప్టు, సిరియా, హెడ్జాజ్, అఫ్ఘనిస్థాను మున్న దేశాలవిభాగపడి విరుచుకుతినుటకు సిద్ధంగాఉన్నారు. ఈప్రైదేశాలన్నిటిలోనుగల ప్రజలు ౧౦౦కి ౯౯ మంది ముస్లిములే. చాలావరకు ముస్లిములవ్యవస్థలన్నీ యీదేశాలలోనేఉన్నవి. భారతదేశంలో పాకిస్థానంకోసం ప్రాణత్యాగంచేస్తామనువీరుఅంతా, అతిపురాతనములయిన యీదేశాలలోని పాకిస్థానులనురక్షించుటకునడుముకట్టాలి ఇంతవరకీవిషయంలో మీరెవరయినా యేప్రయత్నమైనాచేశారా? ప్రస్తుత సంకటసమయంలో యిండియాలో వివిధవర్గాలవారుపరస్పరైకమత్యం సాధించుకొనిప్రవర్తించాలి, ఇప్పుడుభారతదేశాన్నిరక్షింపజూచుట ముఖ్యవిధిగాని, భారతదేశమును విభజింపబూనుటకర్తవ్యము గాదు".

---

## గోలకొండ డైరీ

౧౯౪౨ సహాలేవరకు సిద్ధమగును

ఈమారు ౧౯౪౦ప్రకటల విజ్ఞానవిషయాలు రైతుల హక్కులు, భూమిశిస్తువిషయాలు, పంచాంగం, ఇంకాచాలా క్రొత్తసంగతులుచేర్చి చాలా పెంచివ్రాయబడినవి.

కాగిదాలధర రెండంతలైనను

క్యాలికోబైండు డైరీ ౧కి వెల

౧౪ అణాలు

అందరికినీ ఒకేధర.

బైండుచేయని డైరీధర

ప్రతి. ౧కి ౧౨అణాలు

సగముచర్మము కాలికోబైండుధర ౧_౪_౦

పూర్తిబైండు ధర ౨-౨-౦

సగముచర్మము పూర్తిచర్మము డైరీలు కావలసినవారు ప్రత్యేకముగా తెలిపితే సిద్ధంచేయించబడును.

మేనేజరు

గోలకొండపత్రికాలయము

---

## విచిత్రశిశువు

తేలుకుంట, ౨౯-౬-౪౦ ఫ.

[ఓ. వి.]

ఈగ్రామం తా॥ పెద్దాపల్లి జాగీరులోచేరినది. ఇచ్చటఒక కమ్మదబోయిన పాయెంబుఅను గొల్ల భార్యకు ఒకశిశువుజన్మించియుండెను. దానికి స్త్రీపురుష చిహ్నములు రెండుకలవు. ౧౯౪౧ సం.కొనచ్చెను. అట్టిదియీతవరకుబ్రతికి ఆటుయిటుతిరుగుచున్నది. నేడుమాత్రము అచ్చమ్మఅని నామము తల్లిదండ్రులు నిర్ణయించినారు. లక్షణకొనలేదు. కొన్నిరోజులక్రింద పరిసరగ్రామాల జనానికిఅనుచూచిపోతురుయుండిరి.

---

## విద్యార్థిసంఘం

ఖమ్మం మెట్టు

ఇవిసంచిలోతాలుకావు మార్కెట్టురోడ్ స్టానం, చందాదారుల అభిమానం పన్నగిల్లదతీలుకాదారు తెల్పుచుంది. ఏకటకేరెండు పత్రికలతోనే నైజీవించుచున్నందంటే గ్రామాభిమానులు ఆశ్చర్యపోతారు. ఈసమయంలో శ్రీయుతులు నుగ్గల అనంతయ్యంగారు, సహయూర్తి వెంకటఅప్పయ్యగారు గుడుగుంట్ల కృష్ణమూర్తిగారు, అర్వపల్లి బాలకృష్ణగారు వాశ్యమశ్లోకంగారు వినక మంచేసుకున్న తెగ తెంపులను పాటించకుండా పుస్తకప్రతి అరూపంలో సహాయం చేసి, మళ్ళీఒకదారి యేర్పరచినందుకువారికి. ఇలాంటి అభిమానులు, ఉదారులుగల వర్తకసంఘానికి కృతజ్ఞతను తెల్పుతున్నాను,

ఇట్లు

సెక్రెటరీ

---

## ఆంధ్రమహాసభ

నియామకము

ఆంధ్రమహాసభ కార్యకారిణీసభవారు రామారెడ్డివకీలుగారిని సంయుక్తకార్యదర్శిగా ఏర్పాటుచేసినారనియు అళ్వారుస్వామిగారిని ఉగ్రసైజంగు కార్యదర్శిగా ఏర్పాటుచేసినారనియు అనగా వీరుజిల్లాలలో తాలూకాలలోని జిల్లాతాలూకాసంఘాలతనిఖీ చేయుచుందురనియు ఏ.పీ వార్త ఒకటి స్థానికఉర్దూఇంగ్లీషుపత్రికలలో ప్రకటింపబడినది. ఇంతవరకు అధికారిప్రకటనకాలేదు.

---

## పతిలోప వివాహము

—

కొచ్చినులోరద్దగుట

ధర్మశాస్త్రప్రకారము పైజాతులవారు క్రింజాతుల స్త్రీలను వివాహమాడవచ్చును. కాని పైజాతి స్త్రీలు క్రిందిజాతిపురుషులను వివాహమాడరాదు. అట్టివివాహాలను ప్రతిలోమవివాహాలందురు. బ్రాహ్మణ స్త్రీ శూద్రపురుషునిపెండ్లాడితే వారికిపుట్టినవారు చండాలులు అవుతారట.

కొచ్చిసంస్థానములో బ్రాహ్మణస్త్రీ శూద్రపురుషుని వివాహమాడింది. ఆవివాహం అశాస్త్రీయం. అందుచేతఅదిచెల్లదు. అట్టివివాహితులు కులభ్రష్టులైనారు. వారికిఅంతఃకలహం. వారుబహిష్కృతులైనారు. అని కొచ్చిమహారాజాగారుశాసించినారు. ఆదంపతులు రెండేండ్లక్రిందట సివిల్ వివాహశాసనప్రకారమే వివాహమైనారు. ఎట్లయినాసరే వేదాలు,శాస్త్రాలు దీని నంగీకరించవు కావున మేమున్నా అంగీకరించము అని మహారాజాగారు తీర్పుచెప్పినారు

—

## సర్ చింతామణిగారిపట్ల

గాంధిమహాత్మునిసానుభూతి

—

సర్ సి. వై. చింతామణిగారి మరణమునుగూర్చి జూలై ౫ నాడు అలహాబాదునుంచి గాంధిగారు, మాలవ్యాగారును సానుభూతిచూపుచుఇట్లు తంతివార్తలంపిరి.

గాంధీగారు

"భారతపత్రికలు సంపాదక శిఖామణియయిన చింతామణిగారిని కోల్పోయి చాలానష్టపడినది. వీరిమరణానికి సేవసమిత్కాలి విచారపడుచున్నను."

మాలవ్యాగారు

"చింతామణిగారు దేశభక్తులలోఅగ్రగణ్యులయినదేశభక్తి నిస్తులము. ఇతడు సేవచేసెనని జాతియవాడి, ఇతడుచేసిన సేవలో స్వార్థమేమున్నది. పత్రికాసంపాదకులలో నితడు చిరకీర్తి."

—

## మైసూరుశాసనసభలో

—

కాంగ్రెసువక్షమువారి మరొకవిజయము

—

౪ జూలైనాడు మైసూరుసంస్థానపు శాసనసభలో ఒకకాంగ్రెసుపక్షసభ్యుడు, మద్యపాననిర్మూలన శాసనమును అమలుజరుపవలెను. దీనివల్ల ప్రభుత్వమునకువచ్చే నష్టమునుపూడ్చేదియుటకు తగినపన్నులవిధించుటకు ఒకయుపసంఘమును నియమింపవలెను" అనతీర్మానమును ప్రవేశపెట్టెను. దీనిని ఓటునకుపెట్టగా 33 మందిఅనుకూలురుగాను, ౨౮ మంది ప్రతికూలురుగానువచ్చియున్నారు. తీర్మానాన్ని ఆమోదించినారు. ఇదికాంగ్రెసువారి తీర్మానాలు గెలుచుటకు రెండవసర్యాయము. తరువాత అధికమంత్రియిట్లన్నారు.

"మద్యపానమును నిర్మూలించుటకు ప్రజలందరియొక్క సహాయముఅవసరము. ప్రజలసానుభూతిలేనిచో యిదిజరుగదు. కనుక దీనినిముందుగా ప్రజలలోబాగా ప్రచారంచేయాలి. ఈ తీర్మానానికి శాసనసభలో అనుకూలురగనున్నవారందరు ఒకకమిటీని ఏర్పాటుచేయవలెను అట్టికమిటీకి ప్రభుత్వము తగినచేయూతనియ్యగలదు. ప్రభుత్వమువారున్నూ మద్యపాననిర్మూలనమునకనుకూలురే. ఈసంఘమువారు తమనివేదికను ప్రభుత్వమునకు పంపవలసియుండును" ఇవి అధికమంత్రిపలుకులు.

—

## కావలెను

మెట్రిక్యులేషన్‌పరీక్షకు ప్రైవేటుగా చదివి హైదరాబాదునగరములో జరుగుపరీక్షలకు కూర్చునువారు కావలెను, ఆడవారు మగవారుకూడ తయారుచేయబడుదురు. చదువు యిచ్చుటకు వచ్చిగాని, పోస్టుద్వారాగాని చదువుకొనవచ్చును. ఇచ్చటకువచ్చి చేర్చుకొనువారికి భోజనగృహ వసతులుగలవు. ఈనెల 15 వరకే చేర్చుకొనబడుదురు. సీట్లునిండినపిమ్మట చేర్చుకొనబడరు. ముందుగ వెంటనే చేరవలెను. ఇచ్చటకువచ్చి చదువుకొనువారలకు నెలకు జీతము రూ. 5/- పోస్టల్ ట్యూషన్‌వారికి రూ. 7/-

వివరములకు,

పాపులర్ ఇన్‌స్టిట్యూట్

౩ ఇ, యం, హాస్పిటల్ ఎదుట కింగ్‌కోఠి

## గెలిచిన దేశాలలో జర్మను సైన్యాలు

జర్మనీవారివద్ద దండయాత్రకై ప్రత్యేకముగా చండామండులతో కూడిన సైన్యాలున్నవి. సైగాతాము గెలిచినదేశాలలో సైన్యాలనుంచినారు. అట్టిదేశాలలోని సైన్యాలనీతిచెడిపోవుచున్నది, దీన్నిబట్టి జర్మను బలముక్షీణింపగలదనుసూచనలు కనబడుచున్నవి. హాలెండు బెల్జియందేశాలలోజనులు పరాధీనులైనను వారికివిజేతలలో మైత్రిలేదు. జర్మనులకుహాలాహలముగాని భోజనపదార్థాలు చిక్కుటలేదు. జర్మనుసైనికులను పరాజితదేశాలవారు అస్పృశ్యులవలె చూచుచున్నారు. ఆనేకరహస్యస్థలాలలో విప్లవములకై కుట్రలుజరుగుచున్నవి. అట్టివిప్లవసంఘాలను జర్మను గుర్తించగలిగితే వారికిఘోరమైన శిక్షలిచ్చుచున్నారు. కొంతకాలంక్రిందట ౧౬ దచ్చివారిని జర్మనుసేవకున్యతిరేకముగా వర్తించుచున్నారనికాల్చిచంపివేసిరి. ఆస్టర్ డాంనగరంలో గతఫిబ్రవరి నెలలోతిరుగుబాటుజరిగెను. నగరమునంతయు జర్మనుసేనచుట్టివేసెను. పరాజితదేశాలలో తలపన్నువసూలుచేయుచున్నారు. అందుచేజర్మనుసేనను జనులు అసహ్యముతో చూచుచున్నారు.

—

## ప్రకటన

మూడవ నేమాహి సన్ ౧౩౫౧ ఫసలి జాగీరాతుకల్లు ఆమదని చెక్కులు మొదటిసారి తా॥ ౬నుంచి తా॥ ౯వ మహా శేవరు సన్ ౧౩౫౦ ఫసలివరకు రెండవసారి తా॥ ౨౪ మహా శేవరు సన్ ౧౩౫౦ ఫసలీకు మరియు మూడవసారి తా॥ ౧౦ మెహరు సన్ ౧౩౫౦ ఫసలీకు ఈ మహకమాలో ఇవ్వబడును. కావున అందరుజాగీరుదారుసాహెబులు మరియు ముఖ్తాదారుసాహెబులు. నియమింపబడిన తారీఖులలో ఎవరైన చెక్కులు తీసుకోవలయును. పై తారీఖులలో ఎవరైన చెక్కులు తీసుకోనియెడల అట్టిచెక్కులను నాల్గవ నేమాహి సన్ ౧౩౫౦ ఫసలి చెక్కులవెంబడి ఇవ్వబడును.

మదదుగారు నాజిం
అబ్కారి

## ప్రకటన

అబ్కారి మాఖిలాలను కోరువారందరికి తెలియపరచేమనగా యీప్రక్కన వ్రాయబడిన స్థలములందు మరియు తారీఖులనాడు ఆలిజనాబు నాయబునాజిం సాహెబు అబ్కారిసింతుఖానుదంగారి ఇజ్లాసుపైన జిల్లా అత్రాపుబల్దాయొక్క కల్లు, సారాయి, నల్లమందుమరియు గంజాయిదుకాణముల హర్రాజు సం॥౧౩౫౧ ఫ కొరకు చేయుబడును. కనుక మాఖిలాలను కోరువారు మొకర్రరుచేసిన తారీఖులలో హర్రాజుకువచ్చి దుకాణములు పొందవచ్చును.

జాగీరుదార్లు తమ సుమాయిందలను దుకాణములు కోరువారితో హర్రాజులకు పంపగలరని ఆశిస్తున్నది.

ఇతర సంగతులు వివరముగా మొహతెమీమ్ దప్తరునుండి తెలుసుకోవచ్చును హర్రాజుచేయబడు దుకాణముల పెహరిస్తు వ తప్సీలుయేలాన్ వేరే ముద్రింపబడినవి.

హాస్పె తఖ్‌వీజు

తారీకు ౯నుండి ౧౨ మహా శేవరు మొ॥ మహకమే అబ్కారిబల్దానారాయణగూడ కల్లు, సారాయి, నల్లమందు, గంజాయి దుకాణము తాలుకా॥ శుమాలి, జునూబి, శర్కి, గర్బివ ధారూరు.

—

తారీ॥ ౧౮వ ౧౯ మహా శేవరు మొ॥ సంగారెడ్డి మెదకువద్దనున్న తాలుకా గర్బి వ ధారూరు కల్లు,సారాయి, నల్లమందు వ గంజాయిదుకాణములు

మదదుగారు మొహతెమీమ్



## గోలకొండ గ్రంథాలయము

గ్రంథాలయోద్యమము

కర్త— సురవరముప్రతాపరెడ్డి, బి. ఏ, బి, యల్ గారు. ఇది దేశోద్ధారక గ్రంథమాల వారి ౧౧వ ప్రచురణము. ౬౩ పేజీలు వెల ౦-౫-౦ (హాలీ)

ఈగ్రంథముపేరును బట్టియే గ్రంథములోని విషయమేమిటో సుగమముగా బోధపడుచున్నది. ఆనేకవిషయాలలో విశేషానుభవం గడించిన ప్రతిభావంతులయిన వారిచేతితో సృష్టింపబడిన దీగ్రంథము. ఇందులో గ్రంథాలయాలయావశ్యకత, గ్రంథపరిపాలనాపద్ధతి, గ్రంథాలయాలలో నిలిచువాలలో సంఖ్యాక్రమానుసారముగ గ్రంథములనుంచుపద్ధతులు, క్రమసంఖ్య నేర్పరచు పద్ధతి, గ్రంథాలయముల ఉద్ధరించుటలో విదేశీయులకును మనకునుగలభేదము. తత్కారణములను ముఖ్యనగరములలో ఇంకన్నిటిలో చక్కగా, సెల్లరకునుగమునుగుపటుల చర్చించియున్నారు— కొన్నిప్రసిద్ధగ్రంథాలయముల పట్టికనుగూడ చూపియున్నారు. ప్రతివారును చదివి గ్రహించవలసిన మంచివిషయములుగలవు.

"దత్తమాల" కర్త— బచ్చురామన్నగుప్త గారు ప్రకాశకులు. వెల రెండణాలు (హాలీ) గ్రంథకర్త గారివద్ద దొరకును.

ఇది యత్రిమహర్షి సుతుడగు దత్తాత్రేయమహర్షినుద్దేశించి, వారిమహిమాభివర్ణనము చేయుచు వ్రాయబడినది. కవిగారీగ్రంథమును దత్తాత్రేయునకే యంకితమొసంగిరి. ఇందుసుమారు ౧౫౦ పద్యములుకలవు— అన్నియుకందపద్యములు. చదువబాగుగనేయున్నది.

యం. యన్. రాయ్ (జీవితము.)

రచయిత శ్రీగుండవరపు హనుమంతరావు గారు. ప్రకాశకులు— ఆనా గ్రంథమాల వారు. ఇదివారి ౧౫ప్రచురణము. మొత్తంపుటలు ౫౮. వెల ౦-౧-౬ హాలీ.

"రాయ్" గారంటేసర్వసాధారణంగా అందరికీ తెలిసినవారే. అందులోనూ నేటి యువకులకు వారికీవీరి గాఢం పూజాపీఠంవంటిది. వీరిపుట్టుకనుంచి నేటివరకుజరిగిన వీరిజీవితాన్ని వీరులేకనిన ఉద్యమ విధానాన్ని యీగ్రంథములో సంగ్రహంగా ముఖ్యవిషయాలను విడువకుండా వ్రాసినారు రచయితలు.

గ్రంథకర్త గారిశైలి, వారుమున్ముందు ప్రాంభోయేపుస్తకాలలో ధారాళంగా సాగవచ్చునని ఆశిస్తాం!

—

వత్సరము చందా
వాలీ రూపాయలు
ఆరు మాసాలకు
3 రూపాయలు
బ్రిటిషింది రూ గో
సంIIచందా
X-8-0 కల్దారు.
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

The only Popular Paper That reaches The masses In the Dominions

Best Medium for Advertisement

**Volume 16** **Hyderabad-Dn** **Thursday 10 th July 1941** **Number 20**


## జైళ్లునింపే తొందరలేదు

### గాంధీగారి అయిదేండ్ల జాతీయసమర ప్రణాళిక

"మన సత్యాగ్రహసమరం చాలాకాలం జరుగబోతుంది. అది ౫ ఏండ్లకుతక్కువగానిదిగా ఉంటుంది. జైళ్ళనింపే తొందరపమిన్నీ లేదు. జెయిళ్ళను నింపినంతమాత్రాన మనకు స్వాతంత్ర్యంరాదు"

అని గాంధీగారు సెలవిచ్చుచు, ఈక్రిందివిధముగా పత్రికాప్రకటనచేసియున్నారు.

పంజాబు కాంగ్రెసుఅధ్యక్షులగు ఇఫ్తికరుద్దీను గారును, గోపీచందు భార్గవాగారునుకలిసి పంజాబుకాంగ్రెసు గోత్రులలో కొన్నిఅపోహలు బయలుదేరినట్లుచెప్పినారు. అసంగతిగురించి మాట్లాడటంచాలాముఖ్యం,

సత్యాగ్రహసందర్భంలో శిక్షింపబడినవారికి, చాలాఅన్యాయం జరిగిందనితోచి న్యాయవాదులు హైకోర్టుకు అపీలుచేయుటకు న్యాయవాదిసంఘం పట్టుపట్టినట్టువిన్నాను. ఇందుకుచాలా సంతోషించినాను. అంటే ఇందువల్ల సత్యాగ్రహులకు లాభంకలుగునని నేను సంతసించుటకాదు, మరి న్యాయమునకు విజయము చేకూర్చుదమను సంకల్పముతో న్యాయవాది సంఘమువారీవిధముగా పూనుకొనుట నాకుచాలాహర్షమును కలిగించినది. సత్యాగ్రహులు ఎంతకఠినదండనము నైనా అనుభవించుటకు సంసిద్ధులుగానేయున్నారు. కాని అన్యాయవిధ్వంసనమునకై చేయు ప్రయత్నమున కడ్డుపడవలసిన అవసరములేదు. ముస్లింలీగు శాసనసభ్యులు, తనమగడు హైకోర్టుకు అపీలుచేసి తద్వారా శిక్షతప్పించుకొన నిష్టపడలేదనివ్రాసినది. అందుకునేను ఆమెనుయిష్టమొచ్చింటే అట్లాగేజరుగనిమ్మని సమాధానమిచ్చితిని. అయితే సత్యాగ్రహులు తమంతటతాము న్యాయవాదులకడకేగి తమకైవారిని అపీలుచేసి పాటుపడుడనియడుగరాదు. అట్లగుట సత్యాగ్రహిలక్షణమునకు వ్యతిరిక్తము. న్యాయవాదులు సత్యాగ్రహులబాధలనుగుర్తించి యన్యాయధ్వంసమునకై తమంతటతాము చర్యతీసికొనబూనినచో సత్యాగ్రహులడ్డుపెట్టనక్కరలేదు.

ఈమధ్య పంజాబుకాంగ్రెసు సంఘమువారు కొందరు సత్యాగ్రహులపట్టికను నాయనుమతికై పంపియున్నారు. కాని దానినేనుత్వరగా ఆమోదింపనందులకు కాంగ్రెసువాదులందరును మిక్కిలియసంతృప్తిచెందిరి. ఈపట్టికలు ఇచ్చానుసారముచేతనే యంగీకరింపబడతగినవికావు- ఏతన్నిర్ణయమున త్వరపడుట చాలప్రమాదపద్ధతి- నేటిసత్యాగ్రహము ప్రభుత్వమునకు కారణముగక్రమసాపాదింపనట్టిదికాదు. ప్రభుత్వమునకట్టిశ్రమ కలుగకుండ తగినజాగ్రతతోపనిచేయుమను. తమరక్షణమునకై విరోధితో మహాసంగ్రామము నొనర్చుచున్న బ్రిటిషువారికి విచ్చేద్యమగు శ్రమలేకుండచేయుటయే అధునికసత్యాగ్రహలక్షణము. ఈసందర్భములో సత్యాగ్రహులు జైళ్ళకుపోవుటకై త్వరపడనవసరములేదు, ఎందుకనగా, యీసత్యాగ్రహము ఇంకా ౫ సంవత్సరాలు సాగినాసాగవచ్చును. శాంతి, ఓరిమి, ఐక్యత త్యాగశక్తి వీనిని అలవరచుకొనుటలోనే మహత్త్వము కలదుగాని ఊరకజైళ్ళకేగబడి జైళ్లు నింపినంతమాత్రాన స్వరాజ్యలాభముకలుగదు- నిన్నటివరకటివాచే సత్యాగ్రహమున కంగీకరింపబడినవారిలో చాలమంది అసమర్థులకలరు- ఇట్లగుటకు నాయాలోచనాలోపమే కారణము- నేనుస్వబుద్ధివల్లనే అట్లుచేసియుంటిని-అట్లనుమతింపబడిన సత్యాగ్రహులకు నిర్మాణకార్యక్రమమంటే నమ్మకమేలేదు_అట్టివారు కాంగ్రెసునకు భారరూపులు-ఇట్టివారీదేశము, స్వాతంత్ర్యముకైపు ముందుకుదూకుచుండగాఅడ్డుపడుచుందురు_ సత్యాగ్రహియందు అహింసాతత్త్వాన్ని వృద్ధిచేయవలెనంటే, నిర్మాణకార్యక్రమమే దానికి పట్టుగొమ్మయనియు, శాసనోల్లంఘనమునకే కార్యక్రమమే పునాదిరాయియనియు నేననేకమారులు చెప్పియున్నాను_ కనుకఇకనుంచి, నిర్మాణకార్యక్రమములో యెవరికైతేనమ్మకముండునో వారినే సత్యాగ్రహులుగా నిర్ణయింపదలచితిని_మనకెక్కువబలం కావలెనంటే, మనసత్యాగ్రహయుద్ధమును నిర్దుష్టంగా చేయవలెనంటే యీవిధమైన జాగ్రత తప్పనిసరియయియుండును_అందుచే రాష్ట్రీయకాంగ్రెసు సంఘాలవారుపంపే సత్యాగ్రహుల పట్టికను అంగీకరించుటలో కొంత యాలస్యముజరిగినా నష్టములేదు_

దేశములో శాంతి, సౌఖ్యములను విధ్వంసనము చేయుదుష్టులను అణచివేయుటకై యితరసంస్థలతోకలిసి కాంగ్రెసు పనిచేయవలసివచ్చేయెడల, అందుకు కాంగ్రెసుకెట్టియభ్యంతరమున్నూలేదు. ఇందులకే పంజాబుకాంగ్రెసు అధ్యక్షులగు ఇఫ్తికరుద్దీను గారిని సత్యాగ్రహము చేయవద్దనిచెప్పితిని_నామాటపైన ఇఫ్తికరుద్దీనుగారు తమప్రయత్నముకొనసాగించుటకైఇతరసంస్థలనాయకులు కొందరితో సమాలోచనలుగావించిరి. అన్ని సంస్థల ప్రణాళికలను తుంటరులు చీడపురుగులవంటివారు గావున నట్టితుంటరుల నణచుటకై యన్నిసంస్థలవారును పాటుపడవలెను_ మరియు కాంగ్రెసుసంస్థ, ఎంతబలము కలిగియున్నను తుంటరుల యాగడముల నణచుటకు కాంగ్రెసుఒక్కటేచాలదు_కనుక యితరసంస్థల సహాయమునుకూడ పొందవలసియున్నది- ఈవిషయములో ఇఫ్తికరుద్దీనుగారిని చాలామంది విభేదదృష్టితో విమర్శించుచున్నారు_కాని వారు నా సంపూర్ణాంగీకారముతోడనే యీపనిలోచేయిచేసికొనిరి_పంజాబు కాంగ్రెసుసంస్థకధ్యక్షుడయిన తాను ముమ్మొందు సత్యాగ్రహమొనరించుట తనధర్మమనితలంచియు ఇఫ్తికరుద్దీనుగారు నా ప్రోద్బలముచే తమయభిప్రాయము మార్చుకొని యీపని కంగీకరించినారు_ఈవిషయంలో వీరితోపాటుమిగిలినసత్యాగ్రహులకూడ వీరిమార్గమునేఅనుసరించుట అవసరము_ఇందుకై యితరసంఘములతో సంప్రతించుట యవమానకరముకాదు_ ఇందులకట్టి యభ్యంతరము నుండజాలదు_

మరియు, లోగడ కొందరిని, "సత్యాగ్రహముచేయుదుము" అని వాక్రుచ్చినంతమాత్రముననే జైళ్లలోనిర్బంధించిరి. అట్టివారినిపేరుకారణము చూపి ప్రభుత్వమువారు విడుదలవిడుచుచున్నారు_ అట్లువిడుదలబడినవారు మరల సత్యాగ్రహమొనర్చుటకు త్వరపడరాదనియు, తుంటరుల దౌర్జన్యాలను రూపుమాపుటలో సహాయపడజాలని వారినిమాత్రమే సత్యాగ్రహమునకు పంపవలెనని యు నేను ఇఫ్తికరుద్దీనుగారికి తెలియజేసితిని_"

---

## అఖండహిందూస్థానము

---

### మున్షీగారిప్రయత్నము

---

కాంగ్రెసుమంత్రివర్గములోచేరిబొంబాయిరాష్ట్రమంత్రిగాఉండిన కే-యం_మున్షీగారు ఇటీవల కాంగ్రెసునుండి వీడిపోయినవార్త అందరికీ తెలిసినదే. వారుఆటుతర్వాత మొన్ననే భారతీయులు అవలంబించువిధానమునుగురించి యీవిధముగాపత్రికాప్రకటనము కావించియున్నారు.

ఈసమయంలో దేశములోఅందరున్నూ ఏకాభిప్రాయులైదేశాన్ని చక్కబెట్టుకొనకుండిన దేశం చాలాప్రమాదస్థితిలో పడిపోగలదు. నావలెనే హింసాహింసలనుగురించి ఆత్మరక్షణములో హింసాప్రయోగమునుగురించి అభిప్రాయములగల పలువురు తామునూ కాంగ్రెసును వదలవలెనా అనినన్ను అడుగుచున్నారు. అదినేను చెప్పదగినమాటకాదు. ప్రతివాడును తనఅంతఃకరణము ఎట్లుప్రబోధించునో ఆవిధంగా అచరించుకొనవలెను. మరియు గాంధీజీఅభిప్రాయమును కనుగొనుటకూడా చాలామంచిది. మరికొందరు కాంగ్రెసుస్వరాజ్ పార్టీని పునరుద్ధరించవలెనని అభిప్రాయమిచ్చుచున్నారు. నాకిప్పుడు ఇవంతగా ప్రాముఖ్యములు కావు. ఇప్పుడు గమనించవలసినదేవనగా హిట్లరు రష్యాపైదండెత్తుట, వావెల్ సేనానిని యిండియాకుపంపుట దేశములో మతవర్గాలకలహాలు చెలరేగుచుండుట ఈవిషయాలు మనదేశముయొక్క ప్రమాదస్థితిని సూచించుచున్నవి. ఈసమయములో అఖండహిందూస్థానముయొక్క సిద్ధాంతములోవిశ్వాసముకలవారందరును హిందూస్థానాన్ని ఖండఖండములుగాచేసి విభాగించుటను అనుభావనప్రతిఘటించవలెను, కాంగ్రెసు, హిందూమహాసభ బొంబాయికాన్ఫరెన్సు,అజాద్కాన్ఫరెన్సు మోమినులు సభ, బెంగాలుకృషిక ప్రజాసమితి దక్షిణములోని సంఘాలు సిక్కులసభలు, క్రైస్తవులు వీరందరును అన్నివిధాలా అఖండహిందూస్థానానికై పాటుపడుదుమని వాగ్దత్తముచేసియున్నారు. ఇట్టివారిసంఖ్య యీదేశములోఅధికముగానున్నది. వీరందరును భిన్నత్వాన్నివదలి ఏకస్థులు కావలెను

౧౫౦ ఏండ్లనుండి "ఇంగ్లీషు శాంతి" (Pox Brtannica) మనకుదొరికినది. దానిలోజనులు ముగ్ధులైపోయినారు. ఈసమయంలో మనకు క్రొత్తరాజ్యాంగాలకవసరములేదు. మతవర్గాలహక్కుల నిర్ణయమిప్పుడు చేయవీలులేదు. రేపేమి అవుతుందో ఎవరికి తెలియును. ప్రపంచమంతయు గందరగోళములోపడియున్నది. హిందూస్థానముకూడా అసుడిగుండములోనేయున్నది. నాభావనలోని అఖండహిందూస్థానము హిందూముస్లిం సిక్కు క్రైస్తవ, పార్సీ యూరోపియను అనగా హిందూస్థానములో పుట్టినవారందరికి చేరినట్టిది. యుద్ధానంతరము మనమందరమున్నూ సోదరులవలె సుఖముగా జీవించగలిగియుండవలెను. అందుకై మనమిప్పుడే శ్రమించవలెను.

మనదురదృష్టముచేత మనకేమియు సహాయము చేయజాలనట్టి పెద్దమనిషిఅగు అమెరీగారు ఇండియామంత్రిగా లభించినారు. మనదేశాన్ని ఖండించుటకు పూనుకొన్నవారికి సర్వాధికారను వారిచ్చియున్నారు. మీరందరు ఏకాభిప్రాయులుకండి. అంతవరకు మీకురాజ్యాంగాభివృద్ధిదొరకదుఅని వారుచెప్పుచుండుటచేత మనసమస్యలను పరిష్కరించుకొనుటకు వారుసాయపడరనిద్యోతకమగును. కాని వారిట్లుసహాయపడకుండినచో మనమైనను గట్టిప్రయత్నముచేయకుండా ఉండగూడదు,

అన్నిపార్టీలవారున్ను ఏకమై భారతదేశాన్ని విభాగించే ప్రయత్నంచేసేవారిని ప్రతిఘటించవలెను. లేకున్న మతకలహాలు దినదినాలాన పెరిగిపోవుచుండును. నేనదీనికై తగినప్రయత్నాలుచేయుచున్నాను.

---

## ఢాకాలోఅల్లరులు

---

### ౩౦ మందిచంపబడుట ౭౫ మందికి గాయములు

---

ఢాకాలో ఇంకను హిందూముస్లింఅల్లరులు తగ్గలేదు_ జూలై ౬ నాడుప్రొద్దున ముగ్గురిని గుండాలు పొడిచినారు. అందొకడుచచ్చినాడు. ఇంతవరకు ౩౦ మందిచచ్చినారు_ ౭౫మందికిగాయములుతగిలినవి.

### బొంబాయిలో అల్లరులు

బొంబాయిలో గుండాలుకొద్దిగా అలసిపోయినట్లున్నది. అల్లరులుతగ్గినవి. రెండు దినాలనుండి ఏమిన్ని అల్లరులులేవు. ఇదివరలో ఒకయువకుడు కత్తినిదాచుకొనిపోవుచుండగా పట్టుపడియుండెను. వానికిబొంబాయిమేజిస్ట్రేటు ౧౦నెల జెయిలుశిక్షయున్ను ౧౦౦ రూ అపరాధమున్నూ విధించుచూ ముసలివాడుకాని వయసువాడుకాని కత్తిపట్టుకొని తిరిగేవారందరికిని శిక్షయియ్యగలము అనితీర్పుచెప్పిరి. మరొకనికి లాఠీపట్టుకొనిపోయినందులకు ౩౦౦ రూపాయిల అపరాధమువిధించినారు.

### గఫ్ఫారుఖానుగారు

ఖాన్ అబ్దుల్గఫ్ఫార్ ఖాను సరిహద్దుగాంధీగారు ౭ జూలైనాడు పెషావరునుండి మహాత్మాగాంధీగారిని కలియుటకై సేవాగ్రామమునకువెళ్లినారు.

---

## తహసీలు జవాను దౌర్జన్యము

(స్వ-వి-) కొగాల్, ౩౧-౯-౫౦ ఫ.

ఈదినం పగలు ౨_౩౦ గంటలకు తహసీలు కొగాయితు చప్రాసికి రకంవసూళ్ళకై నోటీసులను అసాములకు అందజేయుటకుగాను యిచ్చియుండిరి_ అందులో దూలపల్లిపటేలుపేర ఒక నోటీసుయుండెను. దూలపల్లిపటేలు హైదరాబాదునకు తనసొంతపనిమీదవచ్చియుండెను- ఈచప్రాసి నోటీసును తామీలుచేయుటకు అతన్ని నిర్బంధించుచుండెను. పటేలు నోటీసుతీసుకొనుటకు నిరాకరించుచుండెను- దానిపై తహసీలు చప్రాసి అతన్ని మెడపట్టిగెంటుచూ తాలూకా దారీకచ్చేరీనుండి తహసీలుకచ్చేరీవరకు యీడ్చుకపోయి తహసీలుదారునిముందట నిలబెట్టెను_ తహసీలుదారుగారు పటేలును పహరాలోనుంచుటకు నోటిమాటలతోసెలవిచ్చిరి.

---




Printed and Published by, G. Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad Dn, Editor S. Prathapa Reddy B. A.,B.L.,